# భారత మహిళా ప్రతిభ








వేమూరి సీతారామ శాస్త్రి

# భారత మహిళా ప్రతిభ




★

వేమూరి సీతారామ శాస్త్రి

ఈడేపల్లి, మచిలీపట్టణము

# తొలి పలుకు

పాశ్చాత్య దేశములలో నిటీవల "భారతస్త్రీలు విద్యాగంధ మెఱుంగని వట్టి మూర్ఖురాం" డనియు "స్వాతంత్ర్యము లేని ఉత్త బానిస......" లనియు నొక దుష్ప్రచారము బయలుదేఱినది. అది కేవలము సత్యదూరము, అజ్ఞానమూలకము, భారతజాతికి మిగులఁ గళంకాపాదకము నగుటచే నా హృదయమునకు మిగుల నావేదన మొదవినది. తత్ఫలితములే 'భారతమహిళా ప్రతిభ' 'భారత స్త్రీస్వాతంత్ర్యము' అను చిఱుకబ్బములు. అందు మొదటిదాని నిప్పటి కిట్లు ప్రకటింపఁగల్గుచున్నాను. బాగోగులకు సహృదయులు ప్రమాణము.

ఇందలి కథావస్తువు కీ. శే. సెట్టి లక్ష్మీనరసింహముగారి వ్యాసమునుండి గృహీతము. శ్రీవారి కీర్త్యాత్మకు నా కృతజ్ఞతాభివందనములు. ఆ వ్యాసము తెచ్చియిచ్చి వ్రాయ నుత్సాహపఱచిన యాప్తశిష్యుఁడు చి. ముట్నూరి యజ్ఞనారాయణశర్మకు నా ప్రేమపూర్వక శుభాశిషములు.

ఎటులెటు విద్యాగంధము
పటుసాహసవిక్రమములు ప్రజ్ఞాబల ము
త్కట రాజకార్య కుశలత
మటుమాయములయ్యె హిందు మానినులందున్.

హైందవ భామినీమణుల యద్భుతశక్తు లెఱుంగ కిట్లస
న్నిందల మోపుచుండ్రు పరదేశమువా; రదె నిక్కువమ్ముగా
డెందములం దలంతురు కడింది తపింతురు చాటుచుండ్రుగా
'ఇందు యథార్థమెంతగల' దంచు గణింపరు భారతీయులున్.

ఏలిరి రాజ్యసీమలు వహించిరి మంత్రిపదంబు లెన్నొ యు
ద్ధాల నొనర్చి సాహసము ధైర్యము శౌర్యము వెల్లడించి రా
దోలికలెక్కి గౌరవముతోఁ బురమేగిరి శిల్పగీత కా
వ్యాల మహోన్నతిం గొనిరి; భారతభామలు వట్టి మూర్ఖలే?

గతచారిత్రము త్రవ్వి చూచినఁ గనంగావచ్చు విఖ్యాత భా
రత నారీమణి శేముషీవిభవసారంబెల్లఁ గల్లాడుటల్
హితమో! ప్రాచ్యుల పేర్ప్రతిష్ఠల నసూయేర్ష్యాదులం గప్పనే
రుతురో! లేనిదొసంగు మోపుట మహాద్రోహమ్ము కాదో
బుధుల్!

కవితన్ శిల్పమునందు గానమున విక్రాంతిన్ క్షమన్ రాజకా
ర్య విశేషజ్ఞత దూరదృష్టి మగవాండ్రన్ సర్వథా మీఱఁజా
లుపువుఁబోఁడుల్ మనభారతోర్విఁ గలర న్నీభూతార్థమున్
భ్రాతృహైం
దవదృగ్వీథికిఁ దెచ్చి చూపుటయ యేతల్లక్ష్య మాలింపరే.

ఇట్లు
విద్వద్విధేయుఁడు
వేమూరి సీతారామశాస్త్రి

మచిలీపట్టణము
మన్మథ మాఘము

# భారత మహిళా ప్రతిభ

గురువులకు మ్రొక్కి శారదాస్మరణచేసి
గణపతి నుతించి హయవక్త్రుఁ బ్రణుతి సల్పి
పూర్వ నవ్యమహాక వ్యపూర్వ కావ్య
ఫణితుల గణించి కృతికి నుపక్రమింతు.

స్ఫారయశోలస త్తుళువ వంశపయోనిధి నుద్భవించి నిం
డారి శుభావహామ్మగు మహామ్మునమించి స్వకీయ సత్కళో
త్సారిత సర్వలోక జడతాతిమిరుండయి వెల్గు సత్ప్రధా
చారుఁడు కృష్ణరాయ నృపచంద్రుఁ డశేషబుధాళిరంజిలన్.

ఆతని రాజ్యవైభవము నాతని ధైర్యము శౌర్యముం గళా
చాతురి కార్యకౌశలము సౌరు రసజ్ఞత విద్వదాదరం
బాతని త్యాగభోగములు నాతని పాలన నైపుణంబు వి
ఖ్యాతము లౌట రిత్త గొనియాడుచుఁ గాలముఁ బుచ్చ
నియ్యెడన్.

పసిఁడికిం దావియబ్బినభాతి నానృ
పాలునకు బుద్ధి గీష్పతిఁ బోలువాఁడ
ఘటిత ఘటనా పటిష్ఠుఁ డుత్కటయశుండు
మంత్రియై విలసిల్లెఁ దిమ్మరుసు బుధుఁడు.

ప్రాజ్య విద్యాధి నగర సామ్రాజ్య విభవ
శోభితుండల శ్రీకృష్ణభూభుజుండు
దక్షిణాశా విజయయాత్ర తగ ముగించి
తరలెఁ బూర్వ దిగ్యాత్ర కుత్సాహమెసఁగ.

చతురంగంబు బలంబు మున్నతువఁ గృష్ణక్ష్మాతలేంద్రుండు గీ
ష్పతికిందీటగు మంత్రితోఁగదలి పెల్చన్ ముట్టడించెన్ మహో
ద్ధతసత్త్వం బుదయాద్రిదుర్గముఁ బ్రవృత్తింబయ్యోదానన రణాం
బతిఘోరంబుగ రెండువాగులకు హాహాకార మేపారఁగన్.

ఇది యిటులుండఁగ నెల్లూ
ర్పృథివీ పాలావతంసు ప్రియసుత విద్యా
సదనమని రూపసుగుణా
స్పదమని విని వలచెఁ గృష్ణవసుధేశుఁడు మున్.

తనరు న్నెల్లూర్మండల
మున శానాఁడు కనకగిరి ముఖ్యనగరిమై
జనపతియటనుండి యెటో
యనుఁగుల సాయమునఁ బడసె నాసతిపటమున్

కన్నె మిన్ననామ మన్నపూర్ణాదేవి
యందచందమరయ నపరరతియ
విన్నదానికన్న మిన్నమై యాకన్నె
సొబఁగు తేని మిగుల సొగయఁజేసె.

జరగెడు కయ్యమెకా దెద
మఱచె నృపాలుఁడు తదీయమహిత గుణ నిరం
తర చింతాకులితాంతః
కరణుండయి విశ్వమెల్లఁ గరము విరాళిన్.

పట్టఁగలేక నెమ్మనముఁ బట్టి పలార్చెడు కంతుతాపమున్
గుట్టటొ బైటఁ బెట్టఁ దనకూర్మి యమాత్యుని
ప్రోలరాయ; లా
దట్టుఁడు దూరదృష్టిగల తజ్జ్ఞుఁడు గావున వీరరుద్ర స
మ్రాట్టుని వియ్య మెల్లగతి మంగళకారిగ నెంచె తేనికిన్.

‘‘అన్నపూర్ణ జనకుఁడా వీరరుద్ర గ
జపతి యోరుగంటి నృపుల సంతు
లోనివాఁడు బలియుఁ గాన నాతని వియ్య
మభిమతమ్ముఁ గూర్చు యశముఁ బేర్చు.’’

అనుచు రాయబారమంపె రాయలకుఁ బు
త్రిమణి నిమ్మటంచుఁ దిమ్మరుసు ప్ర
ధాని; కాని దాని కా నృపాలుఁడు సమ్మ
తింపఁడయ్యె దూరదృష్టి లేక.

మున్నపో తీనె ననుమాత్ర దూడఁ గట్టి
వేయుఁడనుమాడ్కి శ్రీకృష్ణరాయల జన
నమ్ముఁగూర్చిన యపవాదునమ్మి యతఁడు
తానుగా వచ్చు సిరిఁ గాలఁ దన్నుకొనియె.

వేయిజన్మలెత్తి విపినమ్ములన్ ఘోర
తపముసల్పఁగాక, ధాత్రియెల్ల
ధారవోయఁగాక, తనకు రాయలవంటి
యల్లువానిఁబడయనగునె యెందు.

చెలులయు బుధులయు మోమున
విలసద్రూపాభిజాత్య విక్రమ విభవా
దుల విని రాసుత రాయల
వలచెన్; దనతండ్రి కృతికి వగచెన్ మిగులన్.

కూతు నియ్య నియ్యకొనక కయ్యమ్ముకై
కాలుద్రవ్వ రుద్రగజపతిపయి
దాడివెడలనెంచె ఁడు సేనానిపై
జరగుచున్న యుద్ధభరమునుంచి.

అంత దండనాయకుని రాయసమువంశ్యుఁ
గొండమరుసయ్యఁబిలిచి వాక్రుచ్చెనిట్టు
లోయి దండనాథాగ్రణీ! యుదయగిరిని
బట్టుకొను భారమెల్ల నీపైనిబడియె.

తలవనితలంపుగాఁ జనవలసివచ్చెఁ
గనకగిరిముట్టడింప; నీకలిమినమ్మి
చనుచునుంటిమి; శక్తివంచనము లేక
పాటుపడుమయ్య! జయము చేపట్టుమయ్య!

నావిని నమ్రుఁడై 'మనుజనాథ! ప్రసాదము చిత్త' మంచు సే
నావిభుఁడాజ్ఞ నొందలఁగొనం; జతురంగబలంబుతో ధరి
త్రీవిభుఁడుం బ్రధానియును ద్వేషము వేషముగొన్న మాడ్కి బల్
తీవర మొప్పఁగాఁ జనిరి దిక్కులు గ్రక్కదలన్ మహోగ్రులై.

సంఖ్యయందు సూత్న సాధనసామగ్రి
కలిమియందు యుద్ధకౌశలమునఁ
గృష్ణరాయలబల మెన్ని రెట్లో హెచ్చు
వీరరుద్ర సైన్యవారమునకు.

తెలియకపోలే దల రా
యల సత్వాధికత; యైన నతఁడు కటకభూ
తలపతి ప్రతాపరుద్రుని
బలమున్ బాసటగనమ్మి ప్రతిఘటియించెన్.

"తనకుమాలిన ధర్మంబు తనరదుగద
సాయముం జేయఁబోవ స్వకీయరాజ్య
మునకు నేముప్పు మూడునో" యని ప్రతాప
రుద్రగజపతి తామానముద్రఁ దాల్చె.

ఏదోనమ్మక యేటఁబడ్డ విధమా యెంబాపమా తేనికిన్;
మీఁదం జేయున దేమి కన్పడదు; మించెంగార్యః; మట్లాట నా
మోదించెం బ్రియపుత్రి రాయలకిడన్; మూర్తమ్ము పెట్టింపఁగా
నాదేశించె; విధించె భృత్యులకునాయా కార్యనిర్వాహముల్.

కూడదనుకొన్న కార్యమ్ము వీడలేము
నడుపనేరము తుదముట్టఁదొడఁగినపని
సర్వమఱచేతనున్నట్లు గర్వపడుదు
మెంతయవివేకమో కదే యిది తలంప.

ఆయదిశిశిరర్తువు మే
లై యలరారెడు వివాహమాదిశుభమ్ముల్
సేయఁగ; మూర్తమునిర్ణయ
మాయెన్ ఫాల్గునపు బహుళపంచమనాఁడో ర్తోన్.

పంచిరి శుభలేఖలు వే
యించిరి పందిళులు పాకలెల్లపనులు చే
యించిరి తగువసతులు క
ల్పించిరి పిల్పించి రర్థిఁ బ్రియబాంధవులన్.

కనకగిరినామమన్వర్థకంబుగాఁగఁ
బురముఁ గైసేసి రింపుసొంపులు రహింప
మేలి మేల్కట్లతోఁ, దోరణాలతోడ
ధ్వజచయముతోడ దివ్యకంబములతోడ.

నిత్యకృత్యములనె నిత్యకల్యాణమ్ము
పచ్చతోరణముగఁ బరిఢవిల్లు
కనకగిరిపురంబుఁ గన్ రాచపెండ్లియు
నౌటఁ గనకగిరియ యనఁగ నొప్పె.

వెనువెంటనె రాయలు విజ
యనగరికిం దగినవారి ననిచి నిజస్త్రీ
జనమును బరివారము సఖు
లను సామంతుల నమాత్యులన్ రాపించెన్.

"కనకగిరిపొంతఁ గ్రొత్తరత్ననగ మొలసె
నో! యది మఱింద్రజాలమో, మాయయో!" యన
నంగ క్షణములో మున్న రాయలు విడిసిన
పట్టి బయలెల్ల మారెఁ బట్టణముగ.

వెలసె విశాలములగు వీ
ధులు; నానావస్తుసమితిఁ దొలఁకెడు సంగ
ళ్ళొలసెఁ; బెదపెద్దశిబిరా
ల్బలసెన్; సౌకర్యముల్ విలాసము వెలసెన్

అంతలోన లేఖలంది మిన్నంది యా
ర్వేటివారు పూసపాటివారు
పెమ్మసానివారు వెలుగోటివారు నం
ద్యాలవారు బూదవాళివారు.

ఔకువారలు మొదలుగా నఖిలరాజ
బంధువులును సామంతభూపాల వరులు
వచ్చి; రటువచ్చిన కొలంది హెచ్చెనచట
విడుదులకు నిచ్చు శిబిరముల్ వేనవేలు.

ఆ ప్రదేశమెల్ల నారవిచ్చిన వెల్ల
తమ్మికొలని మాడ్కిఁ దనరి చూడ్కి
కెంతో వింతనించె నెద సంతసముఁబెంచె
సిరికి నాటపట్టన రహిమించె.

అంతన్ ఫాల్గున కృష్ణ సప్తమిని సిద్ధార్థుండు శ్రీ కృష్ణ భూ
కాంతుం డర్మిలిమీఱఁ బెండ్లికొడుకై గంధద్విపంబెక్కి సా
మంతుల్ మిత్రులు బాంధవుల్ కవిబుధామాత్యుల్
పరీవారమున్
బంతుల్ తీరిచి కొల్చిరాఁ దరలి తా వచ్చె న్సువర్ణాద్రికిన్.

వీర రుద్రపతియుఁ బేర్మిమై నెదురేగి
తోడితెచ్చి యెందు నీడురాని
వైభవమ్ముతో వివాహమ్ము పొనరించె
నైదునాళ్ళు వేదచోదితముగ.

హరికథలున్ వధానములు హాస్యపు గోష్ఠులు మేటిబోగపున్
గరితల యాటపాటలును గానసభల్ నగరీ విహారముల్
కరితురగాధిరోహణ విలాసములాదిగ నాటిముచ్చటల్
మురిపము చూచి తీరవలెఁ బో! కనుకల్మికి మేల్ఫలంబుగన్.

సమవిద్యా విభవులకున్
సమశీలవయోఽభిజాత్య సౌభాగ్యులకున్
సమవితరణ గుణులకు వి
య్యమునుం గయ్యము మనోజ్ఞమై యలరారున్.

ఇరువురు సత్కులీనులు మహేంద్రసముల్ వినయైకభూషణుల్
సరసులు విద్వాదాదరము చాగము భోగము పేర్మి పెంపువా
రిరువురు రాజ్యతంత్రవిదు లిర్వురు కార్యవిదగ్ధులౌట నే
కొఱఁతయులేక పెండ్లి యది కోవిద సన్నుతిఁగాంచె నన్నిటన్

పరిణయంబైన వెనువెంట జరుగవలయు
వారి యాచార సరణి శోభనపు వేడ్క;
కాని గుసగుసల్ పుట్టె స్త్రీగణములోన
'వచ్చె నిబ్బంది యాగెఁ బైపని' యటంచు.



'వచ్చెఁగద చేరువకల సంవత్సరాది
పండు గది చన్న మీఁద సల్పంగవలయు'
ననుచు నిర్ణయ మాయె నాయంశము విని
మిన్నకుండిరి పెద్దలు పిన్నలెల్ల.

అంతటఁగృష్ణరాయ 'లిదెయందెఫలంబు కయిన్ గ్రహించి భ
క్షింత'మటంచు సంబరము చెందెదువాఁ డతి సూరవరాటకున్
స్వాంతము చింతిలన్ విడిదిచక్కి దినంబొక యేఁడుగాఁగఁ ద
చ్చింతనతత్కథాశ్రుతి తదీయగుణస్తుతులన్ వ్యయించెడిన్.

ఏచి దిశాతటమ్ముల జయింప నొకమ్మడి దాడిసల్పి నా
రాచకొలంపు సింగమగు రాయలపై వలరాయఁ డుద్ధతుం
డై చిగురాకువింటఁ బువుటమ్ముల నిమ్ముగఁ గూర్చియేసె నీ
లూన్చి వసంతుసూతఁ గడు సాక్కను సోలెను దాన తేఁ
డోగిన్.

వచ్చె నంతలోపలన సంవత్సరాది
పండుగది తన సౌఖ్య సంపదలకాది
యనుచు భావించె రాయ లభ్యంగమాడి
విధులఁ గావించె భక్షించె వేపపూవు.

వేదవేదాంగవిదులైన విప్రవరులు
వచ్చి విన్చిరి నూతనాబ్దముఫలమ్ము
సత్కరించెను నూత్నవస్త్రములవారిఁ
దాల్చెఁదానును గ్రొత్తవస్త్రములఁబిదప.

రెండవ దేవేంద్రుండన
నిండోలగముండెఁ గృష్ణనృపతీంద్రుం డా
పండువుదినమునఁ గన్నుల
పండువుగా బంధుమిత్ర పరివారముతో.

సఖులు సామంతు లుద్యోగ జనులు కనక
గిరి నృపాలురు బాంధవుల్ పరిజనమ్ము
కరముపేరిమిఁబెట్టు నుగాదికాని
కలకు సుంతేని మెఱతెంపు కానఁబడదు.

మణులు తాపిన స్వర్ణభూషణ చయమ్ము
మేలిరకమైన పెద్ద ముత్యాలపేరు
లందమగు మైమఱువులు పీతాంబరములు
మొక్కవోవని యాయుధంబులు నమూల్య

ములగు తేరులు భద్రేభములు తురంగ
మంబు లివి యవినాసేల? మంచి మంచి
వస్తువు లవెల్లఁ గుప్పతెప్పలుగవచ్చి
పడియె రాయల మ్రోల నుపాయనములు.

కట్టకడపట విప్రుఁడొక్కరుఁడు చెవులఁ
బైఁడికుండలములవాఁడు బాహుపీఠి
సేలువలవాఁడు గరుడునాసికగలాఁడు
వచ్చి పఠియించె హృద్యమౌ పద్యమిట్లు.

శ్రీవిభుసన్నిభా! ప్రభువరేణ్యా! యనాథశరణ్యా! కృష్ణరా
యా! వివరంబుగా నరయుమా భవదంగన యన్నపూర్ణ మా
దేవి యపాయముల్దొలఁగి దేవరకున్నిరతంబు శ్రేయమే
కావలెనంచుఁ బంపె హితగర్భితమైనటువంటి కానికల్. *

అనుచుఁ బఠియించి తనహస్తాంబుజమునఁ
బసపుపూసిన శ్రీతాళపద్యపత్ర
ముంచె, వెనువెంట నేదాసి దించెఁ బసిఁడి
పళ్ళెరము; కేలుజోడించి ప్రక్కకరిగె.

ఆపయి రాయలు తనకున్
దాపున నిలుచున్న విప్రతల్లజుఁ గనుచుం
'మీ పే రే'మని యడిగెను
నాపాఱుం డదివిని యిటు లాత్మఁదలంచెన్.

* ప్రాచీన పద్యము

"రాజశేఖరుఁ డీతఁడగుఁ గవిరాజుకూడఁ
బ్రశ్నమిది కంద శార్దూలపద్యములకు
నాదికాఁదగియుండెఁ; దన్నరయువచ్చు
బుధులు కవులౌదురో కారో పొల్పుపట్టఁ
బద్యమయముగఁ బ్రశ్నించువాఁడఁటీతఁడు.
కాన దీనికిఁ బద్యాత్మకంబుగానె
యుత్తరమ్మనొసంగుట యుక్తమగు" న
టంచుఁ దలపోసి తా సమస్యావిధమునఁ
జక్కఁ బూరించి చదివె నింపెక్కనిట్లు.

'.........రిపుప్రకాండములభూమిం బేద లేకుండఁగా
రూపున్మాపి యశోమిషన్ జమిలి కర్పూరంపుఁ బేడల్ దళం
బౌ పోల్కిం గను బంగనాగళములం దండంబుగా వైచు నో
క్ష్మాపాలోత్తమ! 'నందితిమ్మకవి' నాఁగాఁ నేను బేర్గాంచితిన్.'*

'ముద్దుపలుకులుగల ముక్కుతిమ్మనపట
య్యా!' యటంచు రాయలడుగ నాతఁ
డదియు నాటవెలది యాటచేఁ గడమపా
దములనిట్టు లుత్తరముగఁ జదివె.

"....................
...వదాన్యతను నవాంబుముక్క
వగుట ముద్దుపల్కులందె మత్కవితా కు
మారి వానపుల్గుమాడ్కి నధిప!"*

* ప్రాచీన పద్యములు

అనవిని సంతసంబు మదినాగక లేచి భుజంబుతట్టి కృ
ష్ణనృపతి యిట్లనెన్ 'బళిర! సత్కవి! మున్ను విన్నదానికిన్
గనుగొనుదానికిన్ లవము గానను భేదము ముద్దులొల్కు కై
త నిజము నీసుసొమ్ము; కదుధన్యుఁడు మాశ్వుఁడుండు
మీఁస్థితిన్.

'అల్లసానివాని దల్లిక జిగిబిగి
మల్లనార్యకైత మరగ రసము
ధూర్జటికవి కైతఁ దొలఁకు మాధుర్యంబు
ముద్దులొల్కు నీదు ముగ్ధవాణి.'

అనుచు రాయలుచూపు భక్త్యాదరముల
కొడలు పులకింప సంతసంపడుచుఁ దివ్య
కవివతంసుఁడు వినయగౌరవములెసఁగఁ
బలికె మధురోక్తిచాతుర్యమొలయు నిట్లు.

'నరనాథాగ్రణి! యాంధ్రభోజులని రాణంజెందు హా మోముచం
దురు నీక్షింప సుధాసదృశసుగు ముద్దుల్గుల్కు కైతమ్ముచే
కుఱుటల్ వింతలె? మీవచించుక్షముఖ్యుల్ దిగ్గజంబుల్, తదం
ఘ్రిరజంబుం బురుడింపఁబోని నను శ్లాఘింపంగనౌనే యిటుల్?'

అన విని రాయ లిట్లనియె "సద్దిర! సత్కవిచంద్ర! నీదు క
ల్పనపయి భోజభూవిభుసభన్బలె నాసభ నష్టదిగ్గజా
లను నెలకొల్పఁ గౌతుక మెలర్చెదు, వారలలో నొకండవై
ననుఁ జరితార్థుఁజేయవలె, నానుడికాదన కీకొనన్వలెన్."

అనవుడు నెమ్మనంబున సంతసిలి తిమ్మ
కవివతంసుఁడు పల్కె సవినయముగ
"మనుజేంద్ర! నీయొనర్చిన మన్ననకు నెంత
యును గృతజ్ఞుండ, ధన్యుఁడ నిజంబు
నేటిదా మాకు మానితము శ్రీ తుళువవం
శము నాశ్రయమ్ము; నా జనకుఁడైన
మల్లనార్యుఁడు, మేనమామ మలయమారు
త కవియు, మున్ను మీతండ్రిగారి

కల్ల (శ్రీ) నరసింహరాయలకుఁ గృతిగ
నీయరే వరాహపురాణ మింపుగఁ దెలిఁ
గించి; నీచెంతనుంట యుత్కృష్టభాగ్య
మయగు; నాకైన మాతేని యాసవలయు."

అనుచు 'నట్లకానిందు మిమ్మరణపుఁగవి
గా గ్రహించెద మా మామగారివలన'
ననియె నవ్వుచు తేఁడు, కైకొనియెనట్ల
తనదు నాస్థానమునకుఁ దిమ్మనను బిదప.

వీరరుద్రనృపతి గారాపుఁగొమరిత
యన్నపూర్ణయంపినట్టి యుపద
లంది ప్రమదమొంది యారయుచో మూఁడు బం
గారు ప్రతిమ లందుఁ గానఁబడియె.

మూఁడుగూడ నాడుబొమ్మలేచూడ, రెం
డేసి యంగుళమ్ము లెడముగలవు
కాని వానిఁగలుపుఁ గనకశలాకయొం
డందు నడిమి దొక్కయడుగుపొడుగు.

ప్రక్కనున్న తక్కుప్రతిమలు రెండింటి
కంత పొట్టివగుట హస్తయుగము
మొగిచియుంటఁ దెలియనగుచుండెఁ బరిచారి
కలవిగాఁగ నొరులు తెలుపకుండ.

ఆడురూపుమాత్ర మమరిచెనే కాని
వానిఁ జేయుపట్లఁబూనఁడించు
కైనశ్రద్ధ శిల్పి, యాత్మచాతురియెల్ల
వ్యయము పఱచె నడిమి ప్రతిమకొఱకె.

మొగముం గన్నులు ముక్కు చెక్కులు చెవుల్ ముంగాళ్ళు కేల్గాను ము
న్నగు నంగమ్ముల నన్నిటిం గరముపాయమ్మున్ మనస్థైర్య మొ
ప్పఁగ నందమ్ముగ సున్నితంబుగఁ గళాప్రావీణ్యమెల్లన్ రహిం
పఁగ దాని న్మను చెక్కి దిద్ది మెఱుఁగొప్పం బెట్టి యుండందగున్.

కుడికాలించుకవంచి సాచినిలిచెం గూర్చెంగటిన్ డాకయిన్
గుడికేల్వ్రాల్పలిప్రక్క జాఱవిడిచెన్ బొంగారుసింగారమున్
వెడనవ్వున్ ద్రపకల్మి వ్రాల్గనులు నొల్పెం గ్రొత్తయందమ్ము నె
ల్లెడలం దాండవమాడె జీవకళ యెంతేన్మచటయ్యెంగనన్.

అందచందములను నంగవిన్యాసంబు
మణికిరీటమరసి మదిఁదలంచి
రద్ది రాణిప్రతిమయంచు; నంతటదాని
వెనుక నన్నపూర్ణ పేరు గనిరి.

కాని "యన్నపూర్ణ" నా నలరాయల
సతియొ విశ్వనాథుసతియొ తెలియఁ
దగిన గుఱుతు లేవి యగుపట్టమిని దొ త్త
నిర్ణయింప నేరు నేరరైరి.

పతులకుఁబోలఁతులుస్త్రీయ
ప్రతిమలఁగాన్కలుగ నంపు పద్ధతి క్షితి సం
గతమౌట నద్దిరాయల
సతిప్రతిమగఁదుదకు సర్వసమ్మతిఁబడసెన్.

అంత సభ్యులెల్ల నన్నపూర్ణాదేవి
కార్యకౌశలంబు కాన్కలాచి
తి నలవిశ్వకర్మ పనివానితనము లో
మెచ్చుకొనిరి ప్రమద మెచ్చుకొనిరి.

సభ్యులెల్లరట్లు సర్వాంగసుందరం
బైన ప్రతిమఁగనుచు హర్షపడఁగ
రాపువడఁగఁజొచ్చె రాయఁడావలరాయఁ
డేచివై చుతూపు లేఁచుకతన.

అట్టి దివ్యవిగ్రహంబునన్ లోపమొ
క్కండు కానఁబడియెఁగల్పనేని
యందు నంకమట్టు లదియు నా దేవినా
మాక్షరముల వ్రాఁతయందుఁ బొసఁగె.

ఒక్కదాని ప్రక్క నొకటిగా నక్కరాల్
వ్రాయఁబడక క్రిందివరుస నెగువ
దిగుడుగఁ దలక్రిందుగఁగనమ్ము నోఁతగా
నగపడియె ''ర్ణ పూ న్న అ'' యను సరణి.

'శిల్పి తలక్రిందుగా బొమ్మ చేతసల్పు
తొందఱగ వ్రాయుకతన నీచందముండెఁ
గావలయు' నంచుఁ దమతమ భావములను
నెట్టొ సభ్యులెల్లరు సరిపెట్టుకొనిరి.

తిమ్మరుసుమంత్రి మాత్రమ్ము దీక్షతోడ
బొమ్మవంకను గానక పద్యమ్మువంక
ఱెప్పవాల్పక చూచి యారితివడిగె
'పద్యమిద్ది కవీంద్ర! మీ వ్రాసినదియు ?'

'కాదు కాదు నాదు కవితయియ్యది యార్య!
యన్నపూర్ణ దేవి' దనియె నాతఁ
'డేమి కూర్పునేరుపెంత చక్కగనున్న'
దంచు మంత్రివర్యుఁడర్థిఁ బొగడె.

'ఔను; నాదు శిష్యురాలు సంగీత సా
హిత్యములను గైత నెన్నికఁగని
నట్టి' దనియె సుకవి; యనుమాటలాలించి
మంత్రి పలికె నిటు సముచితముగ.

'మీరల్ చక్కఁగ దిద్ది తీర్చుటన స్వామీ! దేవి యీ కైత గం
భీరంబై, మృదువై మనోజ్ఞమయి యొప్పెన్;
లేదు సందేహం; మీ
రారాజున్ దగ వెంచి యంచితగతిన్ బ్రత్యుక్తులం గాన్పలన్
మీ రాసూఁతునకున్ వడింబసుచు నెమ్మిం దెల్పఁడీ నానుడిన్.'

అని తిమ్మరుసటు రాయలఁ
గని 'దేవా! నేఁటి కొలగము నిల్పెదరే?'
యన 'నప్పా! మఱు కానిం'
డని దిగ్గన లేచె రాయ లతిసంభ్రముఁడై.

అంతన్ లోనికి నేగి రాయ లెటో మధ్యాహ్నపుఁ గృత్యములన్
స్వాంతస్వాస్థ్యము లేక తీర్చి రహః పర్యంకి కాసీనుఁడై
కాంతావిగ్రహ మగ్రమందిడి తదేకప్రీతి వీక్షించుచు
న్నంతన్ వచ్చెఁ బ్రధాని తిమ్మరుసు కార్యాలోచనవ్యగ్రుఁడై.

వచ్చి హెచ్చినమైత్రి వాక్రుచ్చె నిట్లు
'నాయనా! భాగ్యవంతుడవోయి! నీవు
నిందునసురక్తి దానికిన్మెండగు పతి
భక్తి గల్గిన యిల్లాలిఁ బడసినావు.'

అంత రాయలు తలయెత్తి యరసి మంత్రిఁ
జేతిసన్న సుఖాస నాసీనుఁ జేసి
'కాన్కలంపనె పతిభక్తి గాఢరక్తి
కలదనఁగ నౌనె?' యన మంత్రి పలికె నగుచు.

'భక్తి రక్తియు కాదాత్మశక్తియుక్తి
కూడఁగలది నీదువెలఁదిచూడు'మన్న
'నప్ప! తెల్పుచున్నవె యిన్నియంశములను
గాన్క'లనె ఱేఁడు విస్మయాక్రాంతుఁడగుచు.

'కాంతపంపిన పద్యమ్ముఁగానికలును
గలసి యీయంశములనెల్లఁ దెలిపెడిని; య
థార్థ'మనెఁ దిమ్మరుసు; 'పద్యమా!' యటంచు
భ్రూయుగం బెత్తి వింతగా రాయలరసె.

"అవునవుఁ గుమారా! పద్యమందలి 'యపాయ
ముల్త్రోలఁగి' యనుభాగమ్ముపాత్రియేమొ
మది విమర్శించితే?" యంచు మంత్రి పద్య
పత్ర మదియుంచె రాయలపాణియందు.

చదివెంబల్మఱు పద్యమాతఁడు; తగంజర్చించెఁ దాత్పర్యమున్
మదికిందట్టద యేవిశేష; మటుపై 'మంత్రీశ్వరా! కాన గు
ట్టెదియున్; నాథుఁడనెంట నాకరులచే నే కీడువాటిల్లకుం
టెదఁగోరెం జెలి; సాజమేకద! మఱేదీ శంక యింకెవ్యోడన్?'

అని రాయలు వచియించిన
విని యల తిమ్మరుసుమంత్రి 'పృథివీవర! నే
నును నీవలెనే తలంచితి
మునుముగ; బైనొదవె శంక బొమమీఁదిలిపిన్.

'ఎగుడుదిగుడు వ్రాఁతకెల్ల సభ్యులు చెప్ప
గొనిన కారణమ్ము వినరె వీర'
లనియె రాయ; లంత "నాలిఁ జీఁకి నాకు
నచ్చవయ్య వారి చచ్చునుడులు.

'తలక్రిందుగ శిల్పి బొమన్
నిలిపెం జెక్కి' యనుపల్కు నిజమేని వర్ణం
బులుఁ దలక్రిందుగనుండెన్
వలదే? తిన్నఁగ నెయుంట భావ్యంబగునే?"

యుక్తియుక్తంబయిన మంత్రియుక్తి కలరి
విగ్రహం బల తేఁడు వెన్వెంటఁ ద్రిప్పి
పట్టి కన్గొని యచ్చెరుపాటు నొంది
'యౌనవు నిజయథార్థమే' యనుచు మెచ్చె.

"అనఘ! యెగుడు దిగుడు వ్రాఁత యత్నపూర్వ
కంబకాని ప్రమాదజన్యంబుకాద
టంచు గ్రహియించినంతఁ బద్యంబు మరల
మరలఁ బఠియించితిని సవిమర్శకముగ.

"అందు 'వివరంబుగ నరయుము' యనుపల్కు
నాదు హృదయంబు నాలోచనమున డించె"
ననెఁ బ్రధాని; 'చక్క నెఱుంగు మనియ కాదె
దాని భావం' బనుచు మహీజాని పలికె.

"ఔను, దొలుదొల్త నాయాశయంబు నదియ
విన్నమాత్రన నీవు వాకొన్నటుల స్ఫు
రించు; వివరంబుగ నెఱుంగ నెంచుచుఁబోఁడి
యంతకు మునుదెల్పిన విశేషాంశములెవి?

'వివర' మనుమాట కర్థంబు బెజ్జమనియు
బొమ్మ నెటనేని బెజ్జమ్ము వోల్పనగునియు
నిశ్చయించితి కుఱ్ఱ! నా నిశ్చయంబు
బలపఱచెఁ 'గాన్కలు హితగర్భంబు' లనుట.

చదివి చూడుము సావకాశముగఁ బద్య
మర్థమిది యౌనొ కాదొ నీక తెలియనగు"
నను చమాత్యుండు వచియింప నట్ల చదివి
'యార్య! మీ వచించినది సత్యంబ కాని.

కనఁబడదె రంధ్ర' మంచు విగ్రహము నిట్టు
నట్టు ద్రిప్పిచూచెను రాయ; లంత మంత్రి
నగుచు "నోయి! రంధ్రము గూఢముగ నెసంగు
నిది యెఱుంగనె సుమి వ్రాఁత యొగుడు దిగుడు.

"ఉండెఁగాదె దిగువ నుండి యెగువ కక్క-
రంబు లివ్వి సూచకంబులగును
'దిగువనుండి యెక్కి యెగువకు సీలను
నొక్క-'మనుట కిద్ది నిక్క-వంబు."

అని వచింప రాయలచ్చెరుపాటుతో
'సీలయా?' యనంగ 'సీలవిధిగ
నలరు దేవి విగ్రహమునకుఁ గ్రిందిభా
గమున' ననియె నిబ్బరముగ మంత్రి.

రాయలంతఁ గేలఁ బ్రతిమ వేగమయెత్తి
చూడ సీలయున్న జాడ లేద
యైన నూన కాతఁడన్ని వోట్ల వ్రేలు
పెట్టి నొక్కఁ దొడఁగె గట్టిపూని.

నొక్కి చూచుచుండ నొక్క-చో 'టక్కు-' మన్
మ్రోఁతపుట్టెఁ గోన బొమ్మలోలను
గల కిరీటమొఱఁగె బిలము దానన్ సన్న
కాగితంపుఁజుట్ట కానవచ్చె.

కాగితమ్ము విచ్చి కన ముత్తెములఁబోలు
నక్క-రములఁ గోడి చక్క-నైన
వ్రాఁతగోచరించెఁ; బ్రభుమంత్రు లిరువురు
చదివికొనిరి యిట్లు సంతసమున.

“స్వర్ణపుష్పపూజయన్న నాదే అది చేసియేకదా భవ
దమలపత్నినైతి! నన్బోలినట్టి వెలఁది పుడమినున్నె?
నాపాటి యాటదలరమకాదు; కాదాయుమ వివేచనము
వరుస నొకవేళ రాజమౌళి యోషయో; నాయాసకి పేరూ
నితి భవాని మగనిప్రేమ న్బాసి గడె నిలువఁబోదు నన్ను
బలెనే నాప్రతిమ కన్గొనుదుర స్దుర్భ్రమము పొడమి
మీకిది కాన్కగ నేనిపు డంపినదాన, భక్తిని శోధించి
త్రిప్పుదురా యెన్నటికేని నాను[1] మీ విధేయనగుదు
మరుఁడు తావకారి నే నచలజాత అన్నపూర్ణ.”[2]

చదివికొని నృపాలుఁడెద సంశయము గొన్న
పగిది మంత్రివర్యు మొగమువంక
నవియపనిగఁజూచె నమ్మంత్రి ‘నీదు సం
దేహమేమి? కుట్జ! తెల్పు’మనియె.

“అప్పా! నీప్రతిభావిశేషము ప్రశంసాతీత మత్యద్భుతం
బెప్పాత్తిం బసివట్టితో ‘బొమబిలం బేపారుఁ గ్రీవంక సీ
లొప్పున్ దానినిబైకినొక్క బిలమెట్లో వ్యక్తమౌ’ నంచు మే
నుప్పొంగెన్ బులకించె నెమ్మదికి నెంతో సంతసంబయ్యెడిన్.

“నీదుప్రజ్ఞావిశేష నిర్ణిద్రశక్తి
నతివ వ్రాసినలేఖ ప్రత్యక్షమయ్యెఁ
బ్రకటితములయ్యె దాన నాపట్లనామె
కలరుభక్తియు యుక్తియు ననఘ! నిజము.

1 నాను = నేను. 2. ప్రాచీనము.

"కాని యాపె సూచించిన కష్టపునుడి
కానరాదేమి యిం దంచుఁగాంచుచుంటి"
నను నృపాలుని పల్కుల 'కానుపైకిఁ
గనఁబడకయుంట భావ్యమే' యనియె మంత్రి

'పైకిఁగనరానిదున్న? లోపలను గలదొ'
యనియె రాయఁడు; 'శ్లేష? కావ్యాత్మకంబు
గద్యమయమొ నిరూపింపఁగలవె కుబ్జ!'
యను ప్రతిప్రశ్నకున్ 'గద్య' మనియె జోఁడు.

"గద్యంబకాఁదగుఁగాని ధారాళమై
నడవక యిటు కుంటుపడఁగ నేల?
'నన్బ్ఫలి' ననుట 'ప్రేమన్నాపసి' యనుట 'యా
న్దర్భ్రిమా' యను 'టాట' యన్న యనుట
లోనైన వుచితంబులౌనె గద్యమునందుఁ
గాన నింతెసఁగు నేదేనిగుప్త
సందేశమొకఁడు నిశ్చయము; కాకేలేఖ
యింతగూఢమ్ముగా నేల? యనుప

పరులచేతఁబడిన నెఱుఁగరానివిధాన
నాతి కరము గూఢరీతి లేఖ
వ్రాసి యిట్లు పదిలపఱచి పంపఁగఁబోలు"
ననియె మంత్రి ముందువెనుకలరసి.

‘ఇంత గుప్తమైన; దీ లేఖ పరులచేఁ
బడుట యెట్టు?’ లనియెఁ బుడమిఱేఁడు
‘బొమ్మఁజూప రర్థిఁబూని త్రిప్పను సీల
యూడవచ్చు’ననియె సూదిమంత్రి.

‘గూఢలేఖలోని గుప్తసందేశమ్ము
వెలువరింప వెరవుగలదె? యన’ క
టంచు ఱేఁడు శీర్షమాడించుచుఁ బల్క—
మంత్రి యిట్లనె సవిమర్శకముగ.

‘‘కలదోయి కలదు మార్గము లేకపోలేదు
తొలుత నాసూత్రంబుల యెగుడు ది
గుడు వ్రాఁత సీల నెగువకు నొక్కుమనుట
కే స్ఫోరకంబని యెంచినాఁడఁ
గాని యిష్డది సూచకముగఁదోచెడు ‘లేఖ
తలక్రిందుగఁ బఠింపఁదగు’ననుటకు,
నాయూపడినయూహ నాయంబనుటకుఁ ‘ద్రి
ప్పుదురా?’ యనుటకూడ స్ఫోరకంబు’’

అనవుడు నృపాలుఁడా లేఖ నర్థిఁ గనుచుఁ
జదువఁదొడఁగె ‘ర్ణ పూ న్న అ’ మొదలుపెట్టి
దిగువనుండి యెగువకుఁ జిత్రగతిదోఁప
దాని నాలించి నగుచుఁ బ్రధానియనియె.

"ఈపఠించెడునది యేభాషయగునొక్కొ!
యష్టభాషలందు నరయఁబడదు
చీనబర్బరాదు లైనట్టి యన్యదే
శ్యాలఁగూడఁ జేరదని తలంతు.

"చూడు లేఖయందు 'శోధించి త్రిప్పుదు
రా!' యటంచు నుండె నట్టి శోధ
నమ్ము మొట్టమొదట నిమ్ముగాఁగావింప
వలయు బేసివర్ణములగునేమొ?"

అన్న యంత వేఁడు 'ర్ణ, న్న, త, ల, న, రి, వ'
యనుచుఁగూడఁబలుకఁ బెనఁగుచుండె
నగుచు మంత్రిపలికె 'నాయనా! విషమాక్ష
రములుగావు చూడు సమములేమొ?'

నోటిలోనిమాట నోటనుండనె 'పూ, అ,
జా, చ, నే, క' యంచుఁ జదివెరాయ;
లడ్డువచ్చి మంత్రి యనియె 'నాయన! సరి
యక్కరములుగావిఁ కరయుమిట్లొ.

'కలదేదో కిటు కద్దిపోలుచునొ'నంగా లేక యిమ్మాడ్కిఁ బె
క్కులు చిక్కుల్ పడుచుంటి' మంచు మదిలో గూఢమ్ముగా
గొణ్గుకొం
చలఁతం జెందుచు నూర్పులన్విడుచు దీర్ఘాలోచనమ్మున్ని ని
శ్చలతం గూరుచునుండెఁ దిమ్మరుసు పై సారించుచుం
జూడ్కులన్.

అతని యాలోచనకు నేమి యంతరాయ
ముప్పతిల్లునో యంచు నోర్విప్పఁడింత
కాలు కేలు కదల్పఁడు గాలికూడ
గట్టిగాఁ బీల్వఁ డొక చిత్ర మట్టు ఱేఁడు.

కరము త్రుళ్ళిపడుచుఁ 'బరిచారికావిగ్ర
హములు విగ్రహము'లటంచు మంత్రి
యఱచె నంత ఱేఁడు 'పరిచారికావిగ్ర
హములఁగూడ బిలము లలరునొక్కొ'

అనుచుఁ బార్శ్వ విగ్రహములఁ గేలంబూని
క్రింది పట్టులెల్ల వ్రేళ్లతోడ
నొక్కి చూడఁ దొడఁగె, నక్కృతింగని మంత్రి
తనదు మాంద్యమునకు వనరెనిల్లు.

'కట్టా! యెట్టి నిగూఢ తాంత్రికపు లేఖల్గాని కన్నంతనే
గుట్టున్నట్టు నెఱుంగ నేర్తునని పేర్గొన్నట్టి నాకే యుగాల్
పట్టెన్ దీని నెఱుంగ; ధీవిభవ పేలా? సీ! కనుంగ్గిలి లే
నట్టాయెన్ బొరగప్పె మిక్కుటపు మాంద్యం బేర్పడెన్
భూవరా!

'పతికిఁ దన విగ్రహ మొకండ సతి యుపాయ
నముగఁ బంపుకొనుట యెందు న్యాయ మట్లు
గాక దాసివిగ్రహములఁ గలిపి పంపె
నిక్కగలదేమొ యని తలంచితిని గాని.

'వానిఁ జేర్చి పంపుట యభిప్రాయపూర్వ
కమగునేమొ యన్ శంకయుఁ గలుగ లేద
కన్నులున్నట్టి యంధత్వమన్న నిదియ
యిప్పుడు విచారపడి ఫలంబేమి భూప!'

నావుడు నృపాలుఁడిట్లనె నయము మెఱయ
'నేల యప్పాజి! యిటు నిన్ను నీవదూఱు
కొందు వింత చిక్కు సమస్య గోటిమీఁదఁ
జక్కవిడఁదీసి తిదినీకుఁ దక్కనొండొ
కనికి సాధ్య మగునె? జాగు కాదె సుంత?

'దేవి యీలాటి గూఢసందేశమంపు
టయును భవదీయబుద్ధి పాటవము నమ్మి
కాని నా తెల్వి తేటలఁ గాంచి కాద
టంచుఁ దలఁచెద నిట సందియంబు లేదు.

'అప్ప! పరిచారికా విగ్రహములఁ దనరు
గుట్టుమట్టుల దయ బయల్పెట్టఁ గలయు'
ననుచు దీనమ్ముగా వేడుకొనుచు రేఁడు
తిమ్మరుసు తెల్పెనిట్లు బల్ సమ్మదమున.

'కనవచ్చుచుండె నాయన! యిప్డు చక్కఁగా
వినుము తెల్పెదఁ బార్శ్వ విగ్రహములు
పరిచారికల లాట వదలి మధ్యస్థ దే
వీ విగ్రహమునకే విలువయొసఁగి

నట్లు లేఖంగల యక్కరాల్ మూఁడేసి
వ్రాసి ప్రక్కవి రెండువదలి నడిమి
వర్ణముల్ వరుసగాఁ బఠియింప గూఢసం
దేశమంతయుఁ దేటతెల్లమగును

తప్పదిదె యిందుఁగల గుట్టు చొప్పు చూడు'
మనుడు ఱేఁడాత్రమున లేఖఁగని 'ర్ణ పూ న్న
అ' యనిన 'మఱేమి? త్రిప్పిన నన్నపూర్ణ
యగును, అది దేవి సంతక'మనియె మంత్రి.

అంత ఱేఁడు 'సి దా ద ప' యని పఠించెఁ
దిమ్మరుసు 'కాదు పదదాసిసుమ్మి యద్ది
యేమి? దేవియూసౌశీల్య మావుకరము
ధన్యుఁడ విటు తెలియవచ్చుఁదక్కు లేఖ'
యనియె ఱేఁడట్లు చేసెఁ దేలిన ఫలమిది.

"పూతచరితా! మనవి; నాటిరాత్రి శోభనపుగది
మిముద్దునుమ నాబదులుగ పగవానికి నాయోజ వేసము
వేయుదురట; పాసుపు వెలితి; పదదాసి, అన్నపూర్ణ"

అట్లు దేవి సందేశరహస్యమెల్ల
బయలుపడినంత మూర్తమ్మువఱకు రాజ
మంత్రు లిరువురు నిర్విణ్ణమానసులయి
చేష్టలుడిగి యన్యోన్యమీక్షించుకొనిరి.

అటుపై రాయలు మంత్రిపాదముల భక్త్యావిష్టుఁడై వ్రాలి 'మీ
పటు మేధాబలమే గురుప్రవర నాప్రాణమ్ము మానమ్ము కం
కటమై కాచెడు బాల్యమాదిగ, నటే కాకున్న నీ రేయి...' యం
చట నోరాడక మైవడంకఁ గనుదో యశ్రుల్గ్లానన్
ప్రాన్పడెన్

తేనిన్ లేవఁగనెత్తి తిమ్మరుసు నిర్వేదమ్ముతో 'నాయనా!
యీనీప్రాణముఁ గావఁజాలినది నీయిల్లాలి సద్భక్తియే
కానీ నామతిశక్తి కాదు; నిజ మాకాంతాలలామంబిటుల్.
తానై వాచిక మంపకున్న యెడ సాధ్యంబౌనె? నిన్గావఁగన్'

అనుడు తేఁడువల్కె 'నప్పాజి! గారాపుఁ
గన్నకూఁతు నిచ్చి గారవించి
చేతులారఁజంపఁ జింతించెనా నన్ను?
వీరరుద్రుఁడెంత క్రూరుఁడో కదే!'

నావిని 'నాయనా! యటు లనస్వల దుర్యోఁగలాభిమాన మే
యూవిల ఘోరకృత్యములకై నను బొల్చరుచున్నిజంబు; తాఁ
బావనమౌ నృపాన్వయము వెంపెసలారుచుఁ గరిమ్మునెక్క నా
భూవిభుఁ, డక్కటంబునన ముందుగ నొప్పఁడు నిదు
వియ్యమున్.

'సమ్మతముగాక యున్న నస్మన్నిరోధ
మున నొడంబడెఁ దొలుదొల్త, మనములోని
పట్టుదల నిట్టి కృతికిప్పు పాలుపడియెఁ
గలఁచుఁగా సదసద్వివేకము నహంత.

అకట! తనపుత్రి సౌభాగ్యమైన మనము
నందుఁ దలపోయఁ డింత కులాభిమాన
మెంతపనికైన వెనుదీయనీదు బిడ్డ!
క్షత్రియులలోన నది యధికమ్ముసుమ్ము'

అని ప్రధాని పల్కెడు మాట లాలకించి
'యప్ప! పానుపు వెలితియం టరసితికద!
సెజ్జవర్జింపుమనియొ? యాచెంత కసలె
రావలదనియొ? సతి యభిప్రాయమేమి?'

అనుచు రాయలడుగ 'నబ్బాయి నీ యూహ
నచ్చలేదు కన్ను విచ్చిచూడు
పద్యమందుఁ గల 'దపాయమ్ము' లని బహు
వచన మాట మఱొ కపాయ ముందు.

'ఆ యపాయ మెట్టిదందువా? తెల్పెద
కథలయందు మనము కందుమకద
సెజ్జనడుమఁ బెద్ద ఛిద్రమ్ముఁగల్పించి
పైని దుప్పటమ్ము పఱతురంచు.

'అయ్య దెఱుఁగకుండ శయ్యపైఁబండిన
నూతియందొ పెద్ద గోతియందొ
తత్క్షణంబ కూలి తనువుఁ బాసెనంచు
నట్టిదేదొ తప్ప కమరిచెదరు.

కాన ముందువెన్కఁగాన కీవారేయి
పానుపెక్క వేగపడఁగరాదు
దులుపునట్లు కేలదుప్పటి న్గట్టిగాఁ
దట్టవలయు గుట్టుపట్టవలయు'

అనుచు మంత్రి చక్కవినుచు పై 'నప్పాజి!
యిప్పు డంతిపురికి నేగుటుచిత
మందురయ్య మీర; లైనచో మఱి యపా
యములమాటయేమి?' యనియె ఱేఁడు.

'తెలిసెన్ దేవికృపాకటాక్షమున ముందేకీడు లేవో; యిఁకన్
దలఁగంగష్టముగా దుపాయమెదొ కన్పట్టున్ భయంబేటి? కం
దులకుంబోయి ప్రతిక్రియన్నెఱప శత్రుల్ లోఁగుదుర్గాని భీ
తిలి యీవంక కె పోవకున్న యెడఁ జింతింత్రుత్త'యంబ్రహ్మ'గన్.

'కాన తప్పకేగుటే నాయభిప్రాయ'
మనుచు మంత్రి తెల్పె; నంత నించు
కంత మనమునందుఁ జింతించి శీర్షమ్ము
నూఁచె నభ్యుపగమసూచకముగ.

'ఇటలీదేశములో మిలానుపురిఁ జేయింపంబడెంజుమ్మి యు
త్తటమీకంకట మిద్దికో'మ్మనుచుఁ గాన్కం బెట్టె న్యూయానీజు ము
న్నిట నాకంకట మున్నదొక్కో?' యనె మంత్రీశానుఁ'డా! నాదు చెం
గటనేయున్నది; దానితోఁ గలదటే కార్యం'బనెన్ రాయలున్.

'ఓయి! యాతనుత్ర ముక్కుతోఁ గావింపఁ
బడిన దైనఁ బట్టువలువవోలె
మెత్తనగుచు నొడలిహత్తుక కత్తి దె
బ్బలను బాకుపోట్ల మలఁచునంట.

'కాన నాటిరేయి దానిని లోనీవు
తొడుగుకొనఁగవలయుఁ, గడమపనులు
చూచుకొందు నేను సుదతికిఁదగిన ప్ర
త్యుత్తరమ్ము వ్రాయుమోయి నీవు.

'తానుబంపిన సందేశతత్వమును గ్ర
హించుకొంటిమొ లేదొయం చెడఁద నడలు
చుండు నీ లేఖతోఁ దగ్గయుపదల జత
పఱచి యీలోన మనము పంపంగవలయు'

అనివచించి మంత్రి యవనికఁదొలఁగించి
చనియెవెలికిఁ దనదు పనులమీఁద
గూఢలేఖవ్రాయఁ గూర్చుండె రాయలు
కలము సాగ దూహ తలకు రాదు.

మానుగ వేల్పుబాస రసమంజరి మున్నుగఁ బెక్కుకావ్యముల్
పూని రచించినట్టి కవిపుంగవుఁడౌ నలరాయ లాంధ్రిలో
నాననఁబోఁడి లేఖ్యమున కర్హగతిం బ్రతిలేఖవ్రాయ నెం
తేని శ్రమంపడెం దుదకు నెట్టటో చేకొనెఁజారితార్థ్యమున్.

అంతనట

కనకగిరి రాచనగరునఁ దనరునొక్క-
వేదికం గూరుచుండిరి వీరరుద్ర
నృపతి తత్పత్ని మాదమ్మ నేలఁగనుచు
నిప్పులంగ్రక్కు-చుండె నానృపతికండ్లు.

క త్తివాటేసిన మొగాన నెత్తురింత
కానఁగారాదు యోచనలోన మునిఁగె
రాణి కించుక చేరువఁ బాణిపద్మ
ముల మొగిడ్చి నిలిచె నన్నపూర్ణ దేవి.

తలనువంచుక వినయమార్దవము లొలయ
'నాన్నగారూ! పిలువఁబంచినారఁటకద!
కారణం బేమొ తెల్పకున్నార దేమి?'
యనుడు కోలకోలంజూచి పేఁడ డిగె నిట్లు.

'పంచినావఁట నిజమె యుపాయనములఁ
గృష్ణరాయల? కీవట్లు లేలపంచి?'
తనుఁడు నించుక జంకుచు ననియె నిట్లు
వంచినశిరంబు వంచినట్లుంచి యామె.

'మనకిది వంశధర్మమని మాయమయుం దమకిట్లు మున్న పా
యనములఁ బేర్మిఁబంచెనని యాప్తసఖుల్ వచియించి హెచ్చరిం
చిన నటు నేను బంచితిని జేసినకార్యము తప్పుగాఁగ మీ
మనమునకున్ స్ఫురించిన క్షమాపణ వేడెదఁ గేలుమోడ్చెదన్.

'మీయమ్మ నాకుఁ బంచుట
న్యాయము దాంపత్య మచట నలరారుటఁ ద
ల్లీ ! యది స్వకులాచారము
నీయదియటుగాదుగా ! మఱేలంపితివే ?'

అనుచు జనకుండు రెట్టించి యడుగ వాల్చు
మోముతోడన శ్రీయన్నపూర్ణ దేవి
'పంపితినిదండ్రి ! నేను నాభర్తగారి
కే, యిటన్ దోసమేమొ యెఱుఁగ' ననియె.

'ఏమి యేమాడితివి ? మగండెట్టులయ్యె
నీకునాతం' డనుచుఁ దండ్రి బోకరించె
'బాబుజీ ! పెండ్లిపీటలపై నెవారు
గూరుచున్న మంత్రములు నాపేరితోన

'నడచినవి కాన నాతండ నాకుభర్త
కాక రాయలవారి కేఁ గాంత నైతి
ననుశుభోదంత మింత కే యాంధ్ర దేశ
మెల్ల నల్లుట నతఁడ నావల్లభుండు'

అనుచు నన్నపూర్ణ యర్థిఁబల్కనయప్పు
డించు కేని గొంతు పెంచ లేదు
కాని యూదిపల్కుకతమున నాపె ని
శ్చయముమాత్ర చక్కస్పష్టపడియె.

'పుస్తెకట్టనట్టి పురుషుండు పతియెట్లు?'
లనియె రుద్రనృపతి; తనయ 'నాన్న
గారు! పుస్తె కేమి? గాంధర్వపరిణయం
బలరుఁగాదె క్షత్రియులకు' ననియె.

'ఇంత వెట్టినీకు నిదియేమె యోతల్లి!
భోగకాంతయందుఁ బుట్టినట్టి
వాఁడె నీవలచిన భర్త? మే'లంచు మా
దమ్మదేవి ఖిన్నయగుచుఁ బలికె.

'హైందవజాతిగౌరవము నభ్యుదయంబు వివాహధర్మపున్
బందము పైఁ బవిత్రమగువర్తనపై శుభలక్ష్యకప్తిపై
ముందును వెన్కఁజూడని యపూర్వపుఁ ద్యాగముపై
రహించు; దీ
నిం దలిదండ్రులార! గమనింపరె? నన్ననుగ్రహింపరే!

'కాలుజాఱినఁ దీసికోఁబోలు; ధర్మ
పథముఁదప్పిన మగుడఁ గ్రాహ్యంబుగాదు
పెద్దలయు బంధులయుఁ బ్రమోలఁ బెండ్లియైన
వరుని విడనాడనగునె? దూర్వడఁగఁదగునె?

'కిట్టని కట్టిడులెవరో
పుట్టించినవాదునమ్మి పుణ్యాత్ముని నా
దట్టుని నీచుగ నెంతురె?
పుట్టువు పూర్వోత్తరములుపోలదె తెలియన్?

'అమ్మ! నాయత్త శ్రీనాగమాంబ వన్నె
వాసికెక్కిన గొబ్బూరివారిపడుచు
నిజము సుక్షత్రకాంత సందియములే' ద
టంచు నన్నపూర్ణాంబ వచించుచుండ.

'మంచివంగడముననె జన్మించుఁగాక
ప్రబలవిద్వేషియతఁడు నా బాంధవంబు
నకు ననర్హుండు; మఱియు నీనాటికేయి
వానియంతమ్ముఁగాంతు శోభనపుగదిన'

అనుచు గజపతి దుర్భరంబయిన కినుకఁ
గాల నేలను మర్దించెఁ; 'గటకటా!' య
టంచుఁ జెవులమూసికొనియె నన్నపూర్ణ
యంత దయమాలి తేఁ డిట్టు లానతిచ్చె.

'మరలన్నాటకమంతయున్నదుపు నమ్మా! బాలచంద్రుండిటన్
దరుణీరూపముఁదాల్చి; పిచ్చితలఁపుల్ ధర్మాలుఁబో నెట్టి చా
తురిమైఁ బెండ్లిని బోలె శోభనమునందున్ బాలచంద్రుండుగాఁ
జరియింపన్వలె నీవు వేర్పడక భాషావేష చేష్టాదులన్'

అని శాసించిన నన్నపూర్ణ 'పితృపాదా! మీమ్మ నేనిప్పుడో
జననమా బాష్పజలంబుచేఁగలఁప; మీసంకల్పమే సిద్ధమై
తనరన్ వజ్రపుబాకు నాకుఁగతియౌఁ దన్మాత్ర మీపుత్రికిన్
జనవీవేడెద భర్తతో సహగతిన్ శాసింత్రుగా సాధ్వికిన్!'

అనుచుఁ బ్రార్థింప మాదాంబ యదరిపడుచు
లేచి ప్రియపుత్రిఁ గలఁక మైఁ జూచి 'వెఱ్ఱి
తల్లి ! కన్నావొ నీకిట్టి తలఁపుచన్నె ?
వర్ధిలెదవీవు దీర్ఘ సౌభాగ్యగరిమ.

'అమ్మ ! మీనాన్నగారి పల్కాదరింపు
ముత్తమ క్షత్రవంశ్యున కొసఁగి పెద్ద
విభవమెసఁగంగ వారె నీపెండ్లి సల్పఁ
గల' రటంచు మనశ్శాంతిఁ గొలుపఁ బలికె.

'మాఱుమనువున్నదమ్మ యస్మత్కులమ్మ
నందు నెందేని జెప్పుమా!' యనియె నన్న
పూర్ణ యమ్మాటలాలించి బొఁగులుముడిచి
పండ్లు కొఱుకుచు గుమ్మమ్ము వఱకు నడచి

'ప్రొద్దుగ్రుంకులోపలన యీసుద్దులెల్లఁ
గట్టిపెట్టి యమ్మాయి యిక్కడకువచ్చి
యుండవలెఁజుమ్మి' యంచు రుద్రుండు కాల
రుద్రు పోల్కి శాసించె నిర్ణిద్రుఁడగుచు.

* * *

కనకగిరిఁ బ్రమదోద్యానవనమునందుఁ
జిన్నిపొదరింటఁ జలువరాతిన్నెమీదఁ
జెక్కిటం జేయిచేర్చి తానొక్కరితయ
కూరుచుండె రాసుత వంతఁ గూరుచుండె

'అందెనో లేదో నాపనిచినట్టి యుపాయన; మందఁగల్గులే
ఖం దిలకించియున్న మహీకాంతుఁడు! దాని నిగూఢభావమిం
పొందఁ గ్రహించి యుండునొకొ! యుల్లమునం దెటులెంచి
నాఁడో! తా
నిందుల కేగుదెంచునకొ! యింతకు నావిధియెట్టులున్నదో!

'ఏల జనింపఁగా వలయు నిట్టి కఠోరదురూహ తండ్రి కీ
బాలిశుతోడి పొత్తిఁక నభావ్య మనర్థద మంచుఁ గృష్ణభూ
పాలుఁడు వీడఁబోఁడుగద పాపిని నన్! గట! లేఖ నేన యే
లా లిఖయించితిన్! దెలిసి యాపద నేగతిఁ దెల్పుమండెదన్!

'ఎఱుఁగక వచ్చి ప్రాణవిభుఁ డివ్వాలలోఁబడి ప్రాణమానముల్
దొఱఁగినఁ గట్ట! నాకిఁక గతుల్గలవే? మని లాభమున్నదే?
యెఱిఁగియుఁ దెల్పఁబోని దొసఁగీయది వేయియుగాలకేని దు
స్తర నరకాంధకూప శతసాత్కృతగా ననుఁ జేయకుండునే?'

అనుచు నామె విచారాబ్ధి మునుఁగుచుండ
నాడుచుం బాడుచుం బంతమాడుచుఁ జెలు
లచ్చటికి వచ్చి రదిగని యామెలోని
వంత యుబ్బనీక ప్రసన్నవదన యయ్యె.



'ఏమమ్మ! యన్నపూర్ణా!
యీమాదిరి యేకతంబ యిటఁ గూర్చుం టే
మోమఱఁపిగారిఁ గూర్చి మ
హా మంత్రార్థమున నుంటివని యే నెంతున్'

అనెను తిరుమలమ్మఁగని 'యట్లు కాదమ్మ
మఱఁదిగారు కరము సరసు లల్ల
వారిఁ దనిపి మెప్పువడయు నుపాయమ్ము
వెదకుచుండె' ననియె వెంగళమ్మ.

'మౌనముద్రదాల్చి మన యన్నపూర్ణ ఈ
యున్నయట్ల కూరుచుండునే మొ?
కొసరికొసరి యడిగి విసిగి పరాఙ్ముఖు
లైన బావగారు; పోనివచ్చు'.

అనియె నోబళమ్మ 'యాబలా! చెలి యంత
తెలివిమాలినదని తలఁచినావె?
బావగారిఁ గష్టపఱుపకుండనె నీవి
వదలు చూడు' మనియె వరద నగుచు.'

ఇట్టు లెవరికిఁదోచినయట్టు వారు
శోభనపుఁ బెండ్లికొమరిత చుట్టుఁ జేరి
సరససల్లాపములు వల్కు తఱిని దేషి
లోన నెట్లుండెనో కోపమూనెఁబైకి.

ముమ్మరమ్మగునట్టి హర్షమ్ము వేళ
నన్నపూర్ణాంబ మ్రోలఁ 'గృష్ణావనీంద్రు
కాన్కలివె గొ'మ్మనుచుఁ జేటికలు నలువురు
వచ్చి యుంచిరి బంగారుపళ్లెరముల.

ఒక్క పళ్లెమ్ములోనుండె జల్తరు బనా
రసుచీర మొకటి రవికతోడ
రెండవదానిలోనుండె నానామణి
స్థగిత సువర్ణభూషణచయమ్ము
పసపు కుంకుమము పుష్పములు చందనమాది
గా నుండె మూఁడవదానిలోన
పసుపుపూసిన తాళపత్ర మొక్కఁడు నాలు
గవ పళ్లెమ్ములో నలరుచుండె

వారలపుడు స్వీయపరిహాసగోష్ఠులు
కట్టిపెట్టి వానిచుట్టుఁ జేరి
కనులపండువుగను గనుచుండ నన్నపూ
ర్ణాంబ కనుచుఁ గననియట్టులుండె.

అంతలోనఁ దాటియాకూని 'మేలు త్వ
దీయ సుందరాకృతి' యటంచుఁ
జదివె వరద; చూమె నదలించి తత్పత్ర
మందుకొనియెఁ గినుక నన్నపూర్ణ.

'చిన్నతనమనిపించితి చన్నె యట్లు
కమ్మపఠియింపఁగ? మఱందిగారు దానఁ
బచ్చిపచ్చిగ నేమేమి వ్రాసినారొ?
వరద! నీది త'ప్పనె నగి తిరుమలాంబ.

'అట్టు లాకారవర్ణన కాదిపెట్టి
నట్టి రెప్పాడు నఖశిఖాద్యంతమెల్లఁ
బాగఁ కుడుగరు శివమెత్తుపోల్కి' ననుచు
వెక్కిరింపుగఁ దాఁబల్కె వెంగళమ్మ.

'ఇరువదై దేండ్ల లేఁబ్రాయ మెనయు పెండ్లి
కొమరుఁ'డని మాటలో మాటఁగూర్చె నాగ
మాంబ;' యగుఁగాని లేఖ గద్యాత్మకంబొ
పద్యమయమొ చెప్పరే' యనె వరద సరద.

'చెప్పఁగలనుగాని చెప్ప దీ యన్నపూ
ర్ణాంబ; యింక నోబళమ్మ యొకత
చెప్పఁగలది' యనియె శ్రీ తిర్మలాంబ; యో
చించి యోబళాంబ చెప్పెనిట్లు.

'పద్యమయమాను గాని తొలిభాగము కాదిది యీపె తొందఱన్
బద్యముమధ్యనుండి చదువంగ దొరంకొనెఁ ద్రిప్పిచూచుచోఁ
బద్యపుటాద్యభాగము నవశ్యము గన్పడు విన్నయంత కే
హృద్యము తక్కుపాదము లవెంతరసోత్తరమై యెసంగునో!'

'ఓబళమ్మ! చూత మూహించి చెపుమ మ
ఱందిగార లెట్లు వ్రాసియుంద్రొ?
తక్కుపాదములను జక్కఁ బూరించి ప
ద్య' మ్మటంచుఁ దిరుమలమ్మ కోరె.

'బాగుబాగు నీవు వాకొనన్వలె' నంచుఁ
దక్కువారలెల్ల నొక్కసారి
కేకలిడిరి దాని కీకొని యాబళ
గడువుకోరె నొక్కగడియమాత్ర.

'అట్ల' యనుచు వార లాపెచుట్టునుజేరి
కూరుచుండి రొండుగోడవఁదక్క
కడమపద్య మెట్లొ వడివడిఁబూరించు
యత్నమందు నోబ్బరంబయుండె.

వరదచేతినుండి బిరబిర యా సన్న పూ
ర్ణమ్ము కొంకులేక కమ్మలాగు
కొనుటకుం. గతమ్ము కొమ్మలెఱుంగరు
పాముకాలిజాడ పామెయెఱుఁగు

గుప్తసందేశగతములో గుట్టుమట్లు
తెలిసినదిగాన వరదచదివిన భాగ
మంద 'రాయః' ల న్పదముంటఁబరసి యట్లు
చేసెఁగాని పఠింప వీల్చిక్కదయ్యె.

ప్రియవయస్యలిపుడు విషయాంతరాసక్త
లగుట నేకతంబ యరిగి యన్న
పూర్ణ పత్రమెల్లఁ బూర్తిగాఁ బఠియించి
కొనియె గుట్టు తెలిసికొనియె నీల.

ఆ సందేశ మిది:

'మేలు త్వదీయ సుందరాకారము భోగ్యము;
సభాసదుల్ సౌరు స్తుత్యర్హమనిరి; నీవు న్గామిన్యా
యుత్తమకాన్తలివి కృష్ణదేవరాయ ప్రాణప్రియా!'*

వెనుకటివలెనే నడిమియక్షరములను దొలఁగించి త్రిప్పి చదువఁగాఁ దేలిన గుట్టిది:

'ప్రియదేవికాయువు; నిత్యసౌభాగ్యము; రాయలు;'

అయ్యదెఱిఁగినంత తొయ్యలి తనదు సం
దేశ మర్మమెల్లఁ దెలిసికొనియెఁ
గా ప్రియుండనుచు మహాప్రమోదంబందెఁ
జింతదక్కి చిత్తశాంతిఁ గొనియె.

అంత నచట 'నాయెనఱగడె; కోరుదే
మరల గడు' వటంచు వరద యడిగె
'వినుఁడు పద్యమిదిగో! వెండియు గడువేటి?'
కనుచుఁ జదివె నోబళమ్మ యిట్లు.

'ఆరసిచూడఁగా రతికి నన్నిటమేలు త్వదీయ సుందరా
కారము మేలుమేలటులు గాన.........
గోరి నిమేషమబ్దమనుకొంచు దినంబులఁ బుచ్చుచుంటి దే
వీ.........వీలుగ............మీనిశన్.*

---

* ప్రాచీనములు

హృద్యమగుపద్య మదివిని యెడఁద మెచ్చి
'మేలు! సెహబాసు! బళి! బాపురే! లతాంగి!'
యనుచుఁజప్పటల్ చఱచుచు నామెఁబొగడు
చొక్కపెట్టున నఱచిరా యక్కలెల్ల.

అట్లు వారెల్లఁగౌతుకాయత్తచిత్త
లగుచునుండఁగ మాదాంబయాప్తదాసి
యచ్చటికి వచ్చి 'పెండిలియందువలెనె
యమ్మగారు స్వయమ్ముగా ననుఁగుఁబుత్రిఁ
బూని ముస్తాబుచేయఁగా ముచ్చటపడు
చున్నవా' రనికొనిపోయె నన్నపూర్ణ.

* * *

ప్రొద్దుగ్రుంకుసరికె పూవులంబండులఁ
జిత్తరువుల మేలియత్తరువుల
నగరువత్తుల మధురాహార వితతి శ
య్యాగృహమ్ము మురువుహరువుగొల్పె.

పెండ్లికొమాళితపతుంపుఁ బేరటాండ్ర
కన్నఁబెండ్లికొమరుని పతొనవచ్చి
నట్టి పేరఁటాండ్రిబ్బడియగుచు నపుడు
శ్రీమయంబకాఁ గన్పట్టె సెజ్జయిల్లు.

సాంతమయ్యెఁ బీటలమీఁది తంతువడిగఁ
బెద్దముత్తైదువలకు నిప్పించిరి విడె
ములను గదిలోనికిన్ దంపతులనుఁజొన్పి
తలుపుమూసిరిఁ దలఁగిరి పొలఁతులెల్ల.

పానుపుఁ జేరినంతన నృపాలుఁడమాత్యుని మేలిపల్కులన్
మానసమందు నిల్పుకొని మంచముమధ్యము నూదితట్టెఁ; దో
డ్తోన తలాడలుం బఱుపు దుప్పటి దిండులు నాగలోకముం
బోని బిలమ్మునంబడియె భూపతి లో నతివిస్మయంపడన్.

అత్తఱిఁ బెండ్లికూఁతురు కరాంబుజమెత్తి నృపాలునక్కుపైఁ
దత్తరపాటుతో సునిశితంబగు కత్తిని మొత్తె; దాన నా
కత్తియ వంగిపోయినదికాని శరీరము గాయమందలే
దత్తమిలంగలేదు లవమైనను నెత్తురు పూన్కిరిత్తగన్.

అంతలోపల లోపలియలజడి గుఱు
తించి రాయలవంక నేతెంచియున్న
పేరఁటాండ్రెల్ల భటులుగామాఱి కవచ
ఖడ్గములతోడఁ దమఱేనిఁ గలసికొనిరి.

వెంటనే యందు నిర్వురు పెండ్లికూఁతుఁ
బట్టుకొని కేలు వెన్కకువంచి విఱిచి
కట్టె; రద్దానఁ గొజ్జాలు కానివారు
పేరఁటాండ్రు కారని చక్క విశదపడియె.

శోభసపుగదిం బెద్ద సంక్షోభమయ్యె
నెందు గగ్గోలు గజిబిజి; యేదో శాక
యూదినట్టులు వినవచ్చె నాదమొండు
దాన మిగులఁ గలంగె నంతఃపురంబు.

ఇట్టటుపాఱువారు, కతమేమొ యెఱుంగక త్రొక్కులాడువా
'రెట్టెటు? లెక్కడెక్క'డని యెత్తినయెల్గున నార్చువారు 'వే
పట్టుఁడు కొట్టుఁ'డంచుఁ బెనుపంతములాడెడువారునైరి; య
ప్పట్టున స్త్రీలుపూరుషులు బాలురు వృద్ధులు ముగ్ధచిత్తులై

ఏడనుండియో తిమ్మరు సూడిపడియె
జేనిముంగల నాసమయాన కర్ధి
మ్రోగసాగెను రణభేరి యూగకుండ
ధణధణాత్కారముల నొక్కక్షణముసేపు.

పరుగుపరుగునఁ బదునాఱువత్సరముల
లేవయసుగలాఁ డొకఁ డప్డు 'దేవ! ప్రాణ
భిక్ష నా పితరుల ప్రాణభిక్ష' యనుచు
వచ్చి ప్రభునడ్గుఁదమ్ములపజ్జ వ్రాలె.

'ఎవ్వఁడవీవు? నీపితరులెవ్వరు? వచ్చినపొచ్చెమేమి?' యం
చవ్విభుకుంజరుం డడుగ 'నార్య! భవత్ప్రియ నన్నపూర్ణ' నం
చవ్విరిఁబోఁడి వాకొనియె నంతట రాయలు దేవినత్తి 'యో
జవ్వని! యత్తమామల కసాధ్వస మొందుఁగలాడువా' రనెన్.

'గూఢమగు సారంగపుబాటఁ గోటనుండి
తరలుచున్నారు వింధ్యాద్రిదరులఁ దలలు
దాచుకొందురఁట వ్వారిఁ దాకకుండ
నానతిందు సేనలకు నాపైని పేర్మి'

అనెడు దేవికోర్కి కనుమతించెను తేఁడు
తిమ్మరుసుముఖాంబుజమ్ముఁ జూచి
చేతఁజిక్కినట్టి చెనఁటి శత్రువు నేని
జెనకరాదనుట ప్రసిద్ధమకద!

అంత తేఁడు మందహాసమ్ముతోఁ బెండ్లి
కూఁతువంకఁ జూపి 'నాతి యియ్య
దెవతె? యువతియగునొ, యువకుండగునొ?' యంచు
నడిగె దేవి తేనికనియె నిట్లు.

'ఆర్య! యీతండు మాతండ్రి యనుఁగుభోగ
కాంతపుత్రుండు పితృాజ్ఞ కారణమున
నిట్టి దుష్కార్యమున కొడిగట్టినాఁడు
వీని విడిపింపుఁడని కోరవెఱచుచుంటి.'

'దేవీ! యట్లనఁబోకు మీతఁడు భవద్వేషమ్ముతోనున్కి మా
భావం బెంతయు నచ్చె మీజనకు సామ్రాజ్యమ్మునన్నిల్పుదున్
నీవిజ్ఞాపన మింతగావలెనె? మున్నే చన్న వార్తాని సం
భావింపంబడరే భవజ్జనకులున్! గాధింతునే వారలన్?'

ఆనెడు రాయలపల్కుల కన్నపూర్ణ
యెంతయును సంతసించె; నేమీ! నృపాలు
క్షమయు నౌదార్యమును; నిట్టి సద్గుణములు
గల్గునాతఁడె క్షమ నేలఁగల్గువాఁడు.

అంతఁ బూర్వదిగ్యాత్ర జయప్రదముగఁ
బూర్తిగావించుకొని స్వీయపురముఁ జేరి
పరిణయంబయ్యె విధ్యుక్తసరణి సుగుణ
పూర్ణ నన్నపూర్ణను గృష్ణభూవరుండు.

* * *

రాజనీతిధురంధర ప్రథితిఁ గన్న
తిమ్మరుసుమంత్రికే విస్మయమ్ముగొల్పె
ననఁగ నన్నపూర్ణాదేవి సునిశితంపుఁ
బ్రతిభ యెట్టిదొ వేఱ తెల్పంగవలెనె?

అట్టి పతిభక్తి, యుక్తి, ధర్మానురక్తి,
భావనాశక్తి, సత్కళాభ్యసన సక్తి
వఱలు వనితామతల్లులు ప్రబలి నిల్పఁ
గడఁగుదురుగాత భారతఖ్యాతఘనత.